శ్రీ సర్వేశ్వరాయనమః

# శ్రీ ప్రణవ శతకము



గంధము రత్నాచలం

విరచితము.

మాడుగుల.

విశాఖపట్టణము జిల్లా.

15—5—1950.



శారదా ప్రెస్, కోధవరం.

శ్రీ మత్ప్రభాకరాయనమః

# శ్రీ ప్రణవ శతకము



గంధము రత్నాచల

విరచితము.

మాడుగుల.

విశాఖపట్టణము జిల్లా.

15—8—1950.



శారదా ప్రెస్, చోడవరం.

# ఉపోద్ఘాతము

శ్రీమన్నారాయణకల్పితప్రపంచమున మానుషత్వము నొందిన నందులకు ముఖ్యమగు ఫలము జ్ఞానంబ.

అదియు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి ప్రమాణానుసార మీసర్వము పరబ్రహ్మ మను పరిపక్వంబు నొందినం గాని మోక్షంబు సిద్ధింపదు.

ఐనను "అయోగ్యః పురుషో నాస్తి" అనెడి ధర్మానుసారము ప్రతిమానవునందుఁ గల యోగ్యత కొంతవఱకైనను బరప్రధాన మగు జ్ఞానముగఁ బరిణమించుననుట నిర్వివాదము గాకపోవదు.

కాఁ బట్టి ప్రాక్సంచితార్థానుసారము నాకుఁ గలిగిన యీ యణుమాత్రంపైన జ్ఞానంబును తద్రూపక బ్రహ్మార్పణముగ నే నీ ప్రణవశతకమును విరచింపఁబూని పరిశుద్ధ నిర్మల మనస్కులు విద్వద్బిరుదాంకితులు ఉభయ భాషాకవితా నిరంకుశులు భగవద్గీతాంధ్ర పద్యానువాదాద్యుత్తమ గ్రంథకర్తలు విమర్శకులు సద్గురువరేణ్యులు నగు బ్రహ్మశ్రీ త్యాడీ (తిపాఠీ) వేంకట శాస్త్రిలవారి యాజ్ఞను బడసి సంకల్పసిద్ధినిఁ గాంచితిని.

సద్గ్రాహణధురంధరు లగు పండితశ్రేష్ఠులందఱి ప్రమా

పములకును సౌశీల్యాహ్లాదవికసితహృదయకమలు లగుదు రనియే సమగ్రవిశ్వాసము నొందుచున్న దానను.

క. కవితాసమగ్రనీరత
ధవళాంభోజాపేత త్స్వాధర్మజ్ఞత యా
యువనిని సామ్యం బయి మా
నవజీవిత సఫలవిధిఘనశ్వాముఁ గనదే.

మాంపుగుల,
15—5—1950.

గురువిధేయ,
గంధము రత్నాచలాభిధేయ.

బ్రహ్మశ్రీ మద్గురువరేణ్యాశీరాశయః.

శ్లో॥ సద్గీతసాహితీ విద్యాసమార్జిత యశోధనామ్
పాయా ద్ధరి ర్గంధవంశోద్భూతాం రత్నాచలాహ్వయామ్
పరిమాణాప్రభేదేన జ్ఞానం సంశుద్ధచేత సా
గ్రాహ్యం తస్మా దిదం కావ్యం మాన్య మేవ విచక్షణైః॥

ఉభయభాషాప్రవీణులు

బ్రహ్మశ్రీ అన్నాపంతుల చిరంజీవిశాస్త్రిగారి యాశయము.

గంధము రత్నాచలాఖ్య తన్వీవిరచిత ప్రణవశతకంబును దిలకించి పులకించితి. ఈమె రచన మంజులమధుర భాషా రసాస్వయాది శోభితమయి తద్విదుషీత్వ కళావతత్వముల వెల్లడించి మించుననుటలో నించుకయు వంచనలేదు. ఇతోధికకృషి నీమెకు భగవంతుఁ డనుగ్రహించుఁ గాక.

శ్లో॥ సరస్వతీ స్తనద్వంద్వ నిత్యోపాసన శేముషీమ్
రత్నాచలాభిదాం పాయా దోర్జ్యాకరః కోవిదాదరామ్.

క. సులలితపదవరకవితా, కలితను బుధవినుత సుగుణగణ్యాను
ధైర్యా
చల వలగంధము రత్నా, చలనామను బ్రోచుఁగాత
శంకరుఁ డెలమిన్.

# కృతి సమర్పణము

క. పరమేశ్వర నీకరుణా
గరిమంబున నే గ్రహింపఁ గలిగిన విద్యా
పరిణతి నీ శతకము నీ
పర మంకితమును నొనర్చి ప్రణవముఁ గొలుతున్.

క. సరసత్రిపాఠ్యన్వయ భా
సుర వేంకటశాస్త్రి గురువిశోభిత విద్యా
వరగంధము రత్నాచల
మురు భక్తిని బ్రణవశతక మొర్విరచించెన్.

క. నాకేంద్రియ విధి హిమకర
ప్రాకట హలాహలాబ్దసామ్యవరవికృతినుమై
శాఖ బహుళ త్రయోదశి
కి కృతి రచియింపఁ బడియెఁ గృతులఁ బెలంగన్.

## భూపాలరాగేచం గేయమ్.

పఙ్కేజపుల్లాయ బ్రాహ్మణాద్యర్ఘ్యేభ్యః పద్మినాథ్య పర్య
దుత్తిష్ఠ బ్రహ్మ విష్ణ్వీశాత్మన్.
ప్రజ్ఞాప్రచోదాయ భక్తాఘానన్దాయ వైరిసంహారణాం
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
సర్వాత్మ చక్షుషే చన్ద్రిశ్రీమాయ ఛాయాత్మ వినోదా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
యామినీ ముక్తాయ కాముకజ్ఞానాయ యజ్ఞహావిర్గ్రాసా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
సప్తాశ్వచారాయ సత్త్వపాత్రాయ సన్ధ్యావన్ద్యార్ఘా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
స్త్రీపుంసదుర్ఘ్యాయ క్షేమప్రదానాయ శిష్టాచారముఖ్యా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
భక్తాఘధ్వంసాయ బ్రహ్మణ్డ ప్రభాయై ప్రాకట్యాహ్లాదధృషా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
మేరుప్రదక్షిణాయ మిహికావినాశాయ మేదినీకల్పకా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.
సృష్ట్యాదిత్రయాయ క్షేమాత్మవ్రతాయ శ్రీవ్యోమమణ్డనా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీసాత్మన్.
వేఙ్కటశాస్త్రిణః విశ్రుతత్రిపాఠినః ప్రీతిహృత్పుంస్తోత్రా
హో త్తిష్ఠ బ్రహ్మవిష్ణ్వీశాత్మన్.

పరబ్రహ్మార్పణమస్తు.

# శ్రీ ప్రణవ శతకము

—(o)—

శ్రీరాధాముఖ మోహా
కార జగత్పావనైకకరము మునివరా
ధారమును నిగమశీర్షము
వారిజ భవరూపమైన ప్రణవముఁ గొలుతున్.

క॥ కామదమోక్షద మగుచును
నేమంబున నుండువారి నిత్యముఁ గనుచున్
క్షేమంబు నొసఁగుచుండెడి
ప్రామినుకుల మించునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 2

క॥ ఓంకారబిందురూపము
లేకం బయి యొప్పు చుండి యిహాముత్రఫలమ్మున్
లోకులకు నొసఁగఁ గల్గిన
ప్రాకటనద్రూపమైన ప్రణవముఁ గొలుతున్॥ 3

క॥ అమలాకారమును నుకా
రమును మకారమును గూడి రమ్యం బగుచుం
గ్రమమైన రూప మొప్పెడి
ప్రమదంబును నొసఁగునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 4

క॥ గురుజనులు సాధుమతమున
నిరతం బెడఁ బాయనట్టి నేమముతోడన్
స్థిరతరమోక్షముఁ గోరుచుఁ
బరిపరివిధములను దలఁచు ప్రణవముఁ గొలుతున్॥ 5

క॥ ద్విరదాననమున విఘ్నే
శ్వరనామముఁ గల్గి మొదట వఱలెడి పూజల్
సురనరులను గనుచుండిన
పరరూపముఁ గల్గునట్టి ప్రణవముఁ గొలుతున్॥

క॥ ధర భూత సృష్టి విధమునఁ
బరఁగుచు లోకైక పూజ్యపదవిం గనునా
పరమేష్ఠి రూపమహిమలఁ
బరమాద్భుతరీతి నొప్పు ప్రణవముఁ గొలుతున్॥ 7

క॥ వనజాతనిలయలక్ష్మి
కనకాంగి భర్తృగరిమఁ గ్రాలుచు భూతా
వనగరిమతోడ సకలా
వని యందున నొప్పునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 8

క॥ సకలాఘవినాశన రూ
పక భూతా తత ప్రళయభావక్రియలోఁ
మెకితాత్మ గౌరినాథతఁ
ప్రకటిత భావ ప్రధాన ప్రణవముఁ గొలుతున్॥ 9

క॥ దర హీరహారమిహికా
కర శంకరవారి చంద్రకంజ హిమసుధా
పరిశుద్ధదేహరాజిత
పరమేశ్వరి వాణియైన ప్రణవముఁ గొలుతున్॥ 10

క॥ నిరతం బక్షర బ్రహ్మ
కరు లయి మృతజీవులైన కవికోవిద భా
స్కరులను మద్ధృదయంబునఁ
బరిపరిరీతులను దలఁచి ప్రణవముఁ గొలుతున్॥ 11

క॥ ధరఁ ద్యాడీ వంశోద్భవు
వర గ్రాంథికనియమగురుని బహు గ్రంథకవీ
శ్వరు వేంకటశాస్త్ర్యాహ్వయ
పరరూపక్రమత మించు ప్రణవముఁ గొలుతున్॥ 12

క॥ అలమేల్మంగాం బాహ్వయ
విలసత్సాధ్వీలలామ విద్వత్కవితా
నిలయమగు సతిని మదిలో
పల భక్తిస్మరణమునను ప్రణవముఁ గొలుతున్॥ 13

క॥ అనుకూలవరత నను, బా
యని ప్రేమను హర్షరసమహాంబోధినిఁ దే
ల్చిన పాలకుర్తికులపా
వనో నప్పారావు ప్రమొక్కి ప్రణవముఁ గొలుతున్॥ 14

క॥ అవనీదేవామరపా
దవనజపూజావిధాన తత్పరమాతం
గవినుత వేంకటరత్నముఁ
బ్రవిమలచిత్తమునఁ జేర్చి ప్రణవముఁ గొలుతున్॥ 15

క॥ వనుఁ బ్రేమచిత్తమునఁ గా
చిన నాపినతల్లియైన శ్రీహరిసేవా
వినయమాత్మను మీనాక్షినిఁ
బనివడి చిత్తమునఁ జేర్చి ప్రణవముఁ గొలుతున్॥ 16

క॥ గేయంబులఁ బద్యంబుల
గాయక కవితానుశక్తిఁ గల్గుచు ముది ము
త్తోయధిఁ దేలిన కృష్ణునిఁ
బాయక మాతులునిఁ దలఁచి ప్రణవముఁ గొలుతున్॥ 17

క॥ వికటార్థచిత్తవృత్తినిఁ
బ్రకటితచారిత్రులైన పరిపంథుల శ్వా
నకులీభూతులఁ గుకవుల
బ్రకరమును దిరస్కరించి ప్రణవముఁ గొలుతున్॥ 18

క॥ కమనీయరూప మొందుచు
కమలత్వముతోడ నొప్పి వేమఱుఁ దలఁపన్
విమలీయమైన ముక్తిని
భ్రమలను బోఁగొట్టి యిచ్చు ప్రణవముఁ గొలుతున్॥ 1

క॥ నిరహంకారమనంబున
నిరతము సేవించువారి నిష్పాక్షికతం
గరుణామయాత్మఁ గాచుచుఁ
బరమొందఁగఁ జేయునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 20

క॥ ఉదకంబు వర్షరూపత
నుదధిని గలియుచును భూమి నొప్పెడిభంగిన్
విదితాత్మభేదసతులును
వదలక యే చెందునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 21

క॥ వనజాక్షుమహిమఁ దెలియఁగ
మనుజులకున్ వశముగాని మార్గంబున నే
యనువున నైన నను నెఱుఁగఁగ
బనిఁ బూనినఁ గలుగునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 22

క॥ పరమాత్ముఁ గొలుచువారలు
పరమాత్మునిఁ బొందునట్టి ఫణితిని సతముల్
నిరుపమభక్తినిఁ గొల్చిన
వరచిత్తులు చెందునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 23

క॥ చతురానన షణ్ముఖులును
సతులసహస్రాస్యనుండు నై నను దలఁపన్
సతు లొనరింపఁగఁ జాలని
వ్రతచిత్తులఁ బ్రోచునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 24

క॥ హరిహర హిరణ్యగర్భులు
పురుహూతాదికదిగీశముఖ్యులు శశిభా
స్కరు లాదిగఁ గలవారలు
పరికింపఁగనైన దివ్య ప్రణవముఁ గొలుతున్। 25

క॥ పరమాత్ముఁ దెలియఁ గల్గిన
వరచిత్తులు దెలియఁగాను వశ మగు ననఁగా
ధర నొప్పు మహిమ మించెడి
పరమైశ్వైక రూప ప్రణవముఁ గొలుతున్॥ 26

క॥ అరుణానలతుల్యం బగు
వర తేజముతోడ నొప్పి వసుమతియందున్
నిరతజ్ఞానులు దెలియఁగఁ
బరమాహ్లాదమున నొప్పు ప్రణవముఁ గొలుతున్॥ 27

క॥ నీరము శుక్తినిఁ జెందిన
సారం బగు ముత్యమైన సరణిని మతి వి
స్తారత తద్గతమునను న
పారంబగు ముక్తి నిచ్చు ప్రణవముఁ గొలుతున్॥ 28

క॥ కవిలోకవినుతవంతము
వివిధానేక కపాత్ర విశ్రుతమును పం
జనిత శుభాస్పదమును నై
ప్రవిమలమై యలరుచున్న ప్రణవముఁ గొలుతున్॥ 29

క॥ జ్ఞానధ్యేయము వేద్యము
నానాదోషైకనాశనంబును విబుధ
ధ్యానానుగణ్యమును భువి
భాను ప్రతిమానమైన ప్రణవముఁ గొలుతున్॥ 30

క॥ హిమకరశైత్యాస్పదమును
విమలాప్రతిమాన దివ్య వినుతంబు సమ
స్తమనుజయోవిమలాశ్రయమును
ప్రమదంబును నైన యట్టి ప్రణవముఁ గొలుతున్। 31

క॥ పరితాపహారము విద్యా
గరిమంబును నిగమముఖ్యగణ్యముఁ గీర్తి
స్ఫురితంబును ముక్తిప్రద
భరితంబును నైన యట్టి ప్రణవముఁ గొలుతున్॥ 32

క॥ బహుభక్తకామ్యదంబును
సహరహమును దోషహరము నతి నిర్మలముఁ
విహితానువర్తన విధా
వహమును నై యొప్పునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 33

క। అల మత్స్యరూప మొందుచు
జలనిధి సోమకునిఁ జంపి చతురాస్యునకున్
విలసద్వేదము నొసఁగిన
బలితపు రూపమున మించు ప్రణవముఁ గొలుతున్। 34

క॥ కమఠావతారమున నే
మముఁ దప్పక యుదధిఁ జొచ్చి మందరభరతన్
సుమనస్సంతతిఁ బ్రోచిన
ప్రమదాస్పదమై నయట్టి ప్రణవముఁ గొలుతున్॥ 35

క॥ అరు దగు కిటిరూపంబున
ధరణీసతిఁ బ్రోచి క్రూరదానవ దురితుం
బరిమార్చి యశము నొందిన
పరిపూర్ణస్థిరత్వ ప్రణవముఁ గొలుతున్॥ 36

క॥ నరసింహాకారంబున
దురితాత్ము హిరణ్యకశిపు దునుముచు భక్తున్
వరప్రహ్లాదును బ్రోచిన
పరితాప ప్రమదహరణ ప్రణవముఁ గొలుతున్॥ 37

క॥ విమల మగు బ్రహ్మచర్యము
ప్రమదంబున మూర్తిఁ గొనిన భంగిని మహిమం
బమరిన వామనరూపము
రమణీయత నొప్పునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 38

క॥ పరశు వను నాయుధంబును
గరమున ధరియించి మించి క్షత్రియులను ద్వా
నిరువదియొకపర్యాయము
పరిమార్చిన రామరూప ప్రణవముఁ గొలుతున్॥ 39

క॥ ధరణీజాత కళత్రతఁ
బరిపంథి ప్రళయరూపవంతుని నసురే
శ్వర రావణుఁ గదనక్రమ
వరమున హరియించినట్టి ప్రణవము గొలుతున్॥ 40

క. ధరణీభారవిమోచన
గురుకార్యామోదమతిని గుజనులఁ జంపన్
గరిమను కృష్ణుం డగు నా
పరమేశ్వరరూప మహిమ ప్రణవముఁ గొలుతున్॥ 41

క॥ ఇలను జగన్నాథుం డయి
వలనొప్పఁగ సకలజనులఁ బాలించుచు ని
ర్మలినాన్న భక్తివంతుల
బలముగ నొనరించినట్టి ప్రణవముఁ గొలుతున్॥ 42

క॥ కలికావతారమున నీ
చులఁ జంపుచు నైజభావసుజనులతో నీ
యిల ధర్మరక్షణత ను
జ్వలరూపముఁ గలిగినట్టి ప్రణవముఁ గొలుతున్॥ 43

క॥ పరమార్థచిత్తవృత్తిని
జరితార్థత నొందనట్టి జనజడరూపం
బరయఁగ స్థాణువు నను
బరిశీలన బుద్ధితోడఁ ప్రణవముఁ గొలుతున్॥ 44

క॥ దురితభయంబును బుణ్యా
స్థిరభక్తియుఁ జెందనట్టి చెడుమానవతం
గర మొందనేల యను ఘన
పరివేదన ప్రజ్ఞతోడఁ బ్రణవముఁ గొలుతున్॥ 45

క॥ రసనాధీనత నొప్పెడు
వసదృశసామర్థ్యమెల్ల నభిరుచితో నా
బిసరుహనేత్రస్తుతిగతి
రసవంతముఁ జేయు చాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ 46

క॥ కరయుగళఫలము పరమే
శ్వరవందనకార్యనియతి భాసిల్లుటయే
కర మిహపరసాధన మను
పరిణామక్రమముతోడఁ బ్రణవముఁ గొలుతున్। 47

క॥ గురునేత్రేంద్రియ ఫల మగు
పరసీజాతస్వరూప సమ్మదదృష్టి
స్థిరయోగము సార్థక మను
పరిపూర్ణస్థిమితబుద్ధిఁ బ్రణవముఁ గొలుతున్॥ 48

క॥ అన్యోన్యదళవసనంబులఁ
గన్నను బరితాపభరము గల్గుచు మదిలో
నన్నఁడు హరి సేవింపక
బన్నముఁ గననేల యనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 49

౨॥ సకలాభిమతము లీయఁగ
నకలంకుఁడు హరియె యుండ నన్యుల వేఁడన్
సుకరంబు గాదటంచును
ప్రకటస్థిర బుద్ధితోడఁ బ్రణవముఁ గొలుతున్॥ 50

౩ కరుణింపఁగ భరియింపఁగ
హరియింపఁగ హరియె చాలు నంచును మదిలో
స్థిరమైన బుద్ధిఁ గల్గుచుఁ
బరమార్థామోదవృత్తిఁ బ్రణవముఁ గొలుతున్॥ 51

౪। మనుజులకు ముఖ్య మగు నల
మన మాపరమేశ్వరత్వమహిమం గనుటం
గను చద్దాని జయించిన
ప్రణుతాత్ములు పుణ్యులనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 52

౫॥ అసమానశబ్ద తతిఁ ద
ద్రసబద్ధముగాఁగఁ జేసి తద్దీనులకై
నొసఁగంగనేటి కను ధీ
ప్రసరణమున మనముఁ జేర్చి ప్రణవముఁ గొలుతున్॥ 53

౬॥ జననమున శీదమేటికిఁ
దన కర్మాచరణమునను దద్దయు జ్ఞానం
బున వెలుఁగుచేని సౌఖ్యము
పనివడి తాఁగల్గు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్। 54

క॥ జ్ఞానంబు గల్గె ననుచును
నానావిధనీచవృత్తి నడువఁగనేలా
జ్ఞాని కిద తగున యనుచును
భానుప్రభ మించునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 55

క॥ నరుఁ డెల్ల చవులందున
వరుఁ డంచు నెఱింగి యట్టి భావము దొలఁగన్
దురితముల నొందఁ జెల్లున
పరిశీలింప కయ యనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 56

క॥ జననమునఁ గర్మభారము
ఘనకర్మంబునను భవముఁ గల్గుటవలనం
జన కర్మఫలము వీడినఁ
బనినా జని యబ్బదనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 57

క॥ జీవుఁ డవివేక మత్తతఁ
గేవలకర్మకుఁడు నగుచుఁ గ్రియ కాఫలముం
దావిడువ కనుభవించుట
భావించుచు పతము నాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ 58

క॥ తన బుద్ధి యుత్తమలచే
తను జ్ఞానముఁ బడసి మోక్షధర్మము నొందున్
మనుజుఁ డది లేక దైహిక
వనరాశిం దేలు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 59

క॥ తను నౌకవలన నైహిక
వనరాశిని దాఁటకున్న భవసంచయమున్
మనుజుఁ డెట్లు దాఁటఁ గలుగును
ప్రణయస్థిరబుద్ధితోడఁ బ్రణవముఁ గొలుతున్॥ 60

క॥ [illegible]రుఁ డెట్టి ఘనత నొందును?
పరమాత్మునిఁ దృప్తిఁ బఱుపఁ బొల్గానజేనిన్
విరి యెట్టి పొగసుఁ గాంచును?
పరిమళ మదిలేకయనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 61

క॥ గతజన్మ బవాళి విజ్ఞత
క్షితి సకలము బ్రహ్మ మనెడి చేతోగతి నా
యతులిత జీవన్ముక్తి ని
రత మొందఁగఁ దగునటంచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 62

క॥ సతి భూషణంబు దలఁపఁగ
పతియే భూలోకసౌఖ్యసాధన మగు నా
సతియే పరసౌఖ్యం బగుఁ
బతి కన్నిట సతియ యనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 63

క॥ పోషణవిషయంబున నా
భూషణ రాజ్యైకమార్గ ముఖ్యంబుల సం
తోషణసన్మార్గంబున
భూషణవిధి విద్యయనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 64

క॥ చల మొకమాయాభూతము
వలె నారాయణునిచేతఁ బంపఁగబడి యీ
యిల మానసబుద్ధులకున్
బలమిచ్చుట దానిఁ ద్రోయఁ బ్రణవముఁ గొలుతున్॥ 65

క॥ దశ చక్రనేమికరణినిఁ
బశుపతినేనియునుబట్టి పాయదు నెపుడుం
గిశఁ బట్టి కొట్టి నేనియు
వశమును నెడఁబాయ దనుచు బ్రణవముఁ గొలుతున్॥ 66

క॥ నరులకుఁ బ్రాణం బధికము
నరయంగా నంతకన్న నాశయు నధికం
బరమగ నది నశియించినఁ
బరమార్థము గల్గు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 67

క॥ పరమార్థచిత్తవృత్తినిఁ
బరితాపం బించుకేనిఁ బడయఁగఁ గలదే
కర మట్టి గుణము గల్గుట
పరమేశ్వర కృపయ యనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 68

క॥ ధరఁ గల్గు సకలగుణముల
గురుతరలుబ్ధత్వ మరయ గొప్పది యగుటం
బరమార్థగుణమునం దది
పరిపూర్ణం బందఁ గోరి ప్రణవముఁ గొలుతున్॥ 69

క॥ ధరణీస్థలి మనుజత్వము
పరమేశ్వరు నొందఁ గలుగ భావవిహీనుల్
గురువర్ణ కాంక్ష్య లగుటను
బరికించుచుఁ బరిహసించుఁ బ్రణవముఁ గొలుతున్॥ 70

క॥ నుతియింప నవరసంబులు
క్షితిఁ గల్గుట వానికెల్లఁ గెలువం బెనగన్
స్తుతిపాత్రుఁడైన యీశ్వరు
ప్రతిభను వర్ణింతు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 71

క॥ సకలంబు బ్రహ్మ మను ను
త్సుక చిత్తులు తత్పదంబు సూటిఁ గన నా
యకలంక తత్త్వవిధి నా
న్వక మదిలో నిడుచు సతముఁ బ్రణవముఁ గొలుతున్॥ 72

క॥ పరుఁ డంతర్యామిత్వా
కరుఁ డగుటను సకల జంతుగణ్యుం డనుచున్
నిరతంబు మదిని నమ్ముచుఁ
బరమప్రేమమున దివ్య ప్రణవముఁ గొలుతున్॥ 73

క॥ అలస త్త్వ మన్నివిధముల
విలసన్మోక్షైకమార్గ విశ్రుత మగుటం
జలనంబులేని తద్విధిఁ
బలుమారులు ముక్తి కొఱకుఁ బ్రణవముఁ గొలుతున్॥ 74

క॥ అసమానధనముఁ గల్గిన
వసుధను బరతాపవిపులబలమును గనినన్
రసవంతభుక్తిఁ గల్గినఁ
బసలేదను జ్ఞానమునను బ్రణవముఁ గొలుతున్॥ 75

క॥ కలలోని విభవతుల్యం
బిలఁ గల్గెడి సర్వమనుచు నెంచుచు మదిలో
నల బ్రహ్మపదవిఁ గోరుచుఁ
బలుకీతులన్నైన సతముఁ బ్రణవముఁ గొలుతున్॥ 76

క॥ కరణత్రితయంబున నొం
డిరవుగ భేదంబుఁ గనిన నెంతయు శుద్ధ
స్థిరభావమొంద కయ్యది
పరమును జెడఁజేయు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్। 77

క॥ ఉదయాది సర్వవేళల
విదితస్ఫుట దివ్యరూప విశ్రుతమహిమన్
మదినిండి యుజ్జ్వలాభా
స్పదమై యలరారునట్టి ప్రణవముఁ గొలుతున్॥ 78

క॥ అతుల జ్ఞానం బనలా
కృతిఁ గర్మముఁ గాల్చుచుండఁ గేవలగుణావిం
దితులను దండింపఁగ నిలఁ
బ్రతిష్ఠాధనమేల యనుచుఁ బ్రణవము గొలుతున్ 79

క॥ రవిగత తేజం బనల
ప్రసరళి తేజంబుఁగూడి బహుళతపంబున్
భువిఁ జేసి మించనేనియుఁ
బ్రవిమలఁ గతిఁ జాలనట్టి ప్రణవముఁ గొలుతున్॥ 80

క॥ హరిహరవిధిభేదంబును
గరము౦ దొలగంగఁ జేయు కంజహితవిధిఁ
హరిహరవిధి మతభేదముఁ
బరిమార్పఁగఁ జాలినట్టి ప్రణవము గొలుతున్॥ 81

క॥ జ్ఞాని నని తలఁచు ఖలు న
జ్ఞానిగ బ్రహ్మమును దెలియ సతతంబును ద
న్మానసముసఁ దలపోసెడి
వానిని జ్ఞానిగను దలఁచి ప్రణవముఁ గొలుతున్॥ 82

క॥ స్త్రీపున్నపుంసకత్వము
లేవగిదిం గానరాని యింపు దలిర్పం
జూపట్టి యఘసమూహముఁ
బావఁగఁ దగినట్టి యల్ల ప్రణవముఁ గొలుతున్॥ 83

క॥ సమచి తప్పతి ను తమ
తమగుణముం గల్గనేని ధన్యాస్పదమై
యమి తేష్ఠ మెప్పఁగఁ జాలుటఁ
బ్రమదంబున దానిఁ జెందఁ బ్రణవముఁ గొలుతున్॥ 84

క॥ మురహరుఁడు శాస్త్రయోనిఁ
బరగుటఁ దద్గౌరవంబుఁ బాసినవారల్
పరు నొంద రిహము శూన్యము
పరశాస్త్రమె ముఖ్యమనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 85

క॥ అలశాస్త్ర నిశ్చితార్థం
బుల మెలఁగ వశంబుగాని మూర్ఖజనంబుల్
చరితాత్మయందుఁ గల్గెడి
ఫలితంబును దెలియ రనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 86

క॥ అలవేదశాస్త్ర ధర్మం
బులు ప్రభువులభంగి సర్వమును శాసింపం
గలిగిన నవి గ్రాహ్యంబులె
ఫలకాంక్షామతుల కనుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 87

క॥ విరులందుఁ గల్గి మించెడు
పరిమళమును బోలి వ్యాప్తవంతము గాఁగ
బరిశుద్ధ చరిత మెప్పును
బరమాత్మ మరీతి ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 88

క॥ అలభారతాది ధర్మం
బులు మిత్రునిభంగి హితము బోధించుటచే
నిల నవి సద్గ్రాహ్యతిబులు
వలనుగ నగు ననుచు నాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ 89

౨॥ రసపూర్ణ కావ్యవిధములు
రసపూరితసతిని బోలి ప్రాభవ మెసఁగన్
రసవంతుఁ బతినిఁ జేయుట
రసవంతము ననుచు నాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ .. 90

౩॥ అంతర్బాహ్యసమత్వం
బెంతయు విజ్ఞానవిధిగ నెసఁగఁగ నదితాఁ
గొంతియుఁ బొటిఁపడు సు
స్వాంతిత వ్యర్థంబు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 91

౪॥ ఆపజ్జలధిఁ దరింపఁగ
నేపగిది దైవబలమె యింపువహింపు
గా పురుషమతము మనుజుల
ప్రాపును దగఁ గోరు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 92

౫॥ విమలాత్ముఁడు మూఢునకున్
సమతను జూపంగ వాక్య చాతురి నేమా
త్రమునైనఁ జూపుటను లా
భము గల్గునె యనుచు సతముఁ బ్రణవముఁ గొలుతున్॥ 93

౬॥ తనయానందము బ్రహ్మం
బని యన్నిటఁ బల్కువాఁడె యజ్ఞుం డని నే
మ్మన మాత్మపరముఁ జేయుచుఁ
బ్రణతు లొనర్చుచును సతముఁ బ్రణవముఁ గొలుతున్॥ 94

క॥ ధనికాధికారగోపము
లను నద్దియు విద్యలోఁ దులల్పయుఁ గన నా
యత్నసఁ జాలదు బుద్ధిఁ జింతటఁ
బ్రణతి విరాజిల్లు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 100

ఆ। భూమిం గల కర్మములు
ద్దామక్రియయజ్ఞదానతపములు నిరత
ప్రేమాదరణీయతచేఁ
బ్రాముఖ్యము లనుచు నాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ 102

ఆ॥ నవయౌవనరసరూపను
కువలయదళనేత్రహాసకోమల విధు మా
ప్రసీమల చంద్రిక హైనను
భవుగను ధవ్వుఁ గవ సగు నని ప్రణవముఁ గొలుతున్॥ 102

క॥ ధర శారదకుచయుగ భా
స్వర సంగీతంబు మఱియు సాహిత్యము నా
యంతట దొరగుల రెంటవ దగఁ
బరముఖ్యము ననుచు నాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ 103

క॥ ధరఁ గల్గు మాయ యుల యీ
శ్వర కల్పితమ్మ ననుచు సతము భావించుచు ధీ
వరతమే ధానిన్ గెల్చుట
పరమేశ్వరు గొల్పుగాఁగఁ బ్రణవముఁ గొలుతున్॥ 104

క॥ భువిఁ గల తపముల నెల్లను
వివరింపఁగ నియమముఖ్య విశ్రుతములుగా
సవినయసత్యత నయ్యు వి
ప్రవిమలమతి నిల్పి సతతముఁ బ్రణవముఁ గొలుతున్॥ 105

క॥ పరమేశ్వరు ధ్యానంబును
బరమేశ్వరసంస్తవంబుఁ బరుపూజనముం
బరమేశ దర్శనంబును
బరమును బొందించు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 106

క॥ అవివేకపూర్ణ చిత్తుఁడు
సువివేకి నటంచు గర్వసూచిత మతి నీ
యవని నిజమతి నొనర్చుట
ప్రవిమల దూష్యంబు ననుచుఁ బ్రణవముఁ గొలుతున్॥ 107

క॥ మంగళ మల శ్రీశునకున్
మంగళము మహేశునకును మంగళ మటులన్
మంగళమూర్తికి విధికి న
భంగంబుగ నొసఁగి యాత్మఁ బ్రణవముఁ గొలుతున్॥ 108

అభేరిరాగేణ చాదితాళే గేయ మిదమ్.

జయమఙ్గళ మిహాస్వీకురు జగదాత్మన్ కృపయా॥
జగదుద్భవరక్షాహరణహేతో। జయమఙ్గళ మిహాస్వీకురు॥
హృదయాహ్లాదక మేవ భవదీయ మేత దఖిలం హృదిరూప మ

హాంచ సిదిత్వా ప్రమః దార్పిత మితి ॥ జయ ॥
తవమేవ భేదో నహి మమ నిశ్చిత సదాశయముదా వికసిత
హృదయోస్మీతి సదానన్ద దస్త్వం త్వసి విజ్ఞానవిశేషోహ్యాతులిత
మహితజీవన్ముక్తివిధి స్స్యాత్ వేఙ్కట శాస్త్రి హృదయః
॥ జయ ॥

పరబ్రహ్మార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ